మానవసేవాగ్రంథమాల 24.

# నీతిబోధ

---

ఇది

సత్యవోలు అప్పారావుగారిచే

రచింపఁబడి

మానవసేవపత్రికయందు

ప్రకటింపఁబడియె.

---





రాజమహేంద్రవరము.

శ్రీవిద్యానిలయముద్రాక్షరశాలయందు

ముద్రితము

1913



0—1—6

# మానవసేవా గ్రంథమాల.

## రాజమహేంద్రవరము.

---

1. కబీరు—చరిత్ర వచనముగను, ఉపదేశములు పద్యములుగను నుండును. అత్తిలి సూర్యనారాయణ గారిచే రచియింపఁబడినది. 0-2-0
2. బంగాళాముంపు—నిడదవోలు వేంకటరావు గారి విరచితము. 0-2-0
3. అగ్గిపెట్టెలయంత్రశాల—కందుల శ్రీమన్నారాయణ గారి విరచితము. 0-4-0
4. లోకపావనశతకము—ఇందలి పద్యములు భక్తిరసము నొలికించుచుండును. ఆదిపూడి సోమనాథరావు గారిచే రచియింపఁబడినది. 0-2-0
5. కోటిలింగశతకము—ఇందలి పద్యములు నీతిని, దేశభక్తిని పురికొల్పును. సత్యవోలు అప్పారావు గారిచే రచియింపబడినది. 0-3-0
6. స్త్రీలయెడ మనము గావించు పంచమహాపాతకములు— నాళము కృష్ణారావు గారిచే రచియింపఁబడినది. 0-1-0
7. వీరమతి—వీరరసప్రధానమైన నాటకము. ఇందు దేశాభిమానము, స్వార్థత్యాగము, పాతివ్రత్యము, స్త్రీసాహసము ప్రదర్శింపఁబడును. మంగిపూడి వేంకటశర్మ గారిచే రచియింపఁబడినది. 0-10-0
8. భారతీయసందేశము—స్వదేశాభిమానమును, విదేశయాత్రవలన గలుగు ప్రయోజనములను వెల్లడించు నొకభాణము. 0-1-6
9. భక్తితరంగిణి—ఇందు భగవద్భక్తి, దేశభక్తి, మానవసేవ మున్నగువాని గూర్చిన పద్యములు గలవు. 0-2-0
10. దేవేంద్రనాథచరిత్రము—అత్తిలి సూర్యనారాయణ గారి విరచితము. 0-2-0
11. అనాథాభ్యుదయము—శిశువులదురవస్థలును, వారివలన దేశమునకుఁ గలుగు మహోపకారములును దెల్పు భాణము. 0-2-0
12. క్రొవ్వొత్తులు చేయువిధము— 0-1-0
13. బాబా గురునానకు చరిత్రము—ఇ. సుబ్బకృష్ణయ్య గారి విరచితము. 0-1-0
14. ఆనందశతకము—ఇందలి ప్రతిపద్యము భక్తిరసాప్లుతమై యుండును. 0-2-0
15. ఉత్తమవివాహము—వివాహభేదములు, ధర్మములు, విధులు దెల్పును. 0-1-0

# నీ తి బో ధ

---

గీ. సత్యము శమంబు దమమును సంతరించి
పరుల బాధల వారింప వలయు నెపుడు
వాఁడు దేశోపకారి యై వఱలుఁ గాన
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 1

గీ. జ్ఞానధనుఁడను బుధుఁడను సకలధర్మ
మర్మముల నేర్చినాఁడను మాన్యుఁడ నని
గర్వపడి బీరములు పల్కఁ గార్య మగునె?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 2

గీ. తిరిపె మెత్తుచు బీదలు దిగులుపడుచు
కూఁడుగుడ్డకు విలవిలలాడుచుండ
ధనము గలవాఁడ నంచు సంతసము నంది
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 3

గీ. అన్నవస్త్రములకు దూర మైనజనులు
చెట్లనీడల వసియించి చిప్పకుజనులు
నెల్లవేళల యాచింప నింట నుండి
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 4

గీ. కష్టపడి జీవనము సేయ కనులు లేక
కాలుసేతులు లేక సంకటముపడుచు
దిక్కుమాలిన పేదలు దిగులు చెంద
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 5

గీ. కాటకములు రోగంబులు నాటుకొనుట
దినము వత్సరముగ నెంచి దిగులుపడుచు
ధనవిహీనులు దుఃఖింప ధన్యుఁడ వని
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 6

గీ. ప్రాయ మది బుద్బుదం బన్నపలుకు వినవె
మృత్యుదేవత సతతంబు మిగులు ననరె
కాన ప్రాణులపై దయ గల్గియుండి
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 7

గీ. అంతరేంద్రియములు నెల్ల నణఁగఁ జేసి
మానసము సాక్షిగా నమ్మి మనలు మెప్పును
లోన దుర్మార్గవృత్తులఁ బూని సతము
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 8

గీ. కాలపురుషుండు నీతోడ మేలమాడు
మృత్యుదేవత వెనువెంట మెలఁగుచుండు
మోహపాశబద్ధుండ వై ముం దెఱుఁగక
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 9

గీ. బిరుదులను దాల్చినంతన పెద్ద యగరు
నీతులను జెప్పినంతన నెగడఁ బోరు
చెనకులను జేసి పరుల హింసింపఁ బోకు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 10

గీ. పరులు చేసిన చెనకుల నెఱిఁగి నీవు
పరుల కవి చేయకుండుట పరమధర్మ
మిట్టిధర్మంబు లెఱుఁగక మిట్టిపడుచు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 11

గీ. ధర్మములఁ దెల్ప నైకమత్యంబు రాదు
సభల నీతుల బోధింప శాంతి రాదు
అంతరింద్రియనిగ్రహ మైనఁ గాని
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 12

గీ. సత్యశీలుండ వీ వని శాంతుఁడ వని
పరమభక్తుండ వని చాలఁ బ్రస్తుతింప
కుచ్ఛితపుమార్గముల నంటి కులుకఁ బోకు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 13

గీ. సకలధర్మంబులను నేర్చు సజ్జనుండు
సకలజనులను దయఁ బ్రోచు సజ్జనుండు
సకలకష్టంబులకు నోర్చు సజ్జనుండు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 14

గీ. దాత వనియును నయగుణోపేతుఁడ వని
నీతిమంతుఁడ వని నిన్ను నెగడ జనులు
మలినమును బాయలేదు నీమానసంబు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 15

గీ. ధనచయంబులు తరగలు తనువు సున్న
భోగములు చంచలంబు లై బూడిఁ గలయు
నిట్టివానిని మది నమ్మి మిట్టిపడుచు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 16

గీ. తను వుసురులఁ బాసిన యంత దగ్ధ మగును
బూటకంపుభోగంబులు బూడిఁ గలయు
నిమిషమాత్రమునను బాయు నీమహనత
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 17

గీ. తోఁడివారల నెంతయుఁ దూలనాడి
నీటుగోటుబింకంబును నెఱతనంబు
జాటినంతన జనులు నిఁక సరసుఁ డనరు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 18

గీ. మృదువు లగుపాన్పులను బండ మేటి యనరు
పుష్పశయ్యల శయనింప భోగి యనరు
ధర్మసత్యశౌచంబులఁ దాల్ప కున్న
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 19

గీ. తగినవేషంబు దాల్చుట ధర్మ మంద్రు
ధర్మపక్షమున నడచుట తగు నటంద్రు
సద్గుణంబులు బూనుట సత్య మంద్రు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 20

గీ. పరులబాధల మాన్చుట పౌరుషంబు
శాంతమును దాల్చి యుండుట జాణతనము
గాన బూటకములఁ బూనఁ గార్య మగునె?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 21

గీ. బాహ్యవేషంబులను జూచి బ్రమసి నిన్ను
నీతిమంతుఁడు నా నది నీటివా్రలు
మానసము సద్గుణంబుల మరగవలయు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 22

గీ. పరమదుర్మార్గవృత్తులఁ బాయకున్న
దుండగంపుమార్గంబులఁ దొలఁగకున్న
పెంటపుర్వునకును నీకు భేద మేది
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 23

గీ. ఆశలను రోసి నిర్మలం బైన మనను
కాయకష్టంబువలనను గలుగుధనము
నంతరించుట సజ్జనసమ్మతంబు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 24

గీ. మగువలవిలాసములఁ జూచి మరులు గొనుట
పాడి గా దని నమ్ముమి భావమందు
పరసతులఁ గూడ నెంచుట పాప మండ్రు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 25

గీ. ధనము నార్జించినన్నాళ్లు దరికిఁ జేరి
గారవింతురు మిత్రులుఁ గన్నవారు
జీవములు దేహమును బాయఁ జేరఁ బోకఁడు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 26

గీ. ఉసురులు శరీరమం దున్న నుత్సవమున
కుశల మరయుదు రింటిలోఁ గొలుచువారు
జీవ మెడబాయ భార్యయుఁ జేర రాదు
మూఢుఁడా! వేషభాషల మురియఁబోకు. 27

గీ. ధన మనర్థము తలఁపంగఁ దనువు బొగ్గు
శత్రుమిత్రకళత్రసంచయము లెల్ల
గగనకుసుమంబు లట్టిద గౌరవంబు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 28

గీ. బాల్యమున నాటపాటలఁబడి చరించి
జవ్వనంబున యువతులస్మరసఁ జేరి
ముదిమి మతి దప్పి యుందువు ముం దెఱుఁగక
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 29

గీ. కలిమి గలనాఁడు సౌఖ్యంబు గలిగె ననుచు
లేమి గలిగిన దుఃఖంబు లే నటంచు
నీవు మదిలోనఁ దలఁచుట నెఱితనంబె
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 30

గీ. సకలసద్గుణసంపత్తి సంతరింప
మరణకాలంబునందు నిర్మలము నందఁ
జిత్తమును బరిశుద్ధిఁ గాఁ జేయ వలయు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 31

గీ. మానసము నంటికొన్నదుర్మలిన మెల్లఁ
దుడిచివేయంగవలె నన్న దుండగంపు
మార్గముల రోసి బ్రతుకుట మంచి దనిరి
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 32

గీ. ఎల్లజనులను నొకరీతి నెంచుచుండి
పేదలను తృప్తులుగఁ జేసి ప్రేమఁ జూపి
కష్టపడి జీవనము సేయఁ గలుగు సుఖము
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 33

గీ. దేహమును నమ్ముకొనఁబోకు తెవులుగొంటు
లోకమును నమ్మ దుఃఖంబు లోఁగి యుండు
జీవ మది చంచలం బని చెప్ప వినవె
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 34

గీ. పండితులసన్నిధిని జేరి పలుక నీవు
విమలవిజ్ఞానవేత్త వై వెలయ లేవు
ధర్మసత్యశౌచంబులఁ దాల్ప లేవు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 35

గీ. కనులపండువు సేయుచుఁ గానఁబడిన
సర్పమును బ్రేమ లాలించుజనుఁడు గలఁడె?
పండితులు నిన్ను మెచ్చరు భ్రష్టుఁడ వని
మూర్ఖుఁడా! వేషభాషల మురియఁ బోకు. 36

గీ. అక్షరం బొక్కటైనను గుక్షిలోనఁ
గంచుకాగడఁ గొని చూడఁ గానఁబడదు;
ధనము కల దని గర్వింప ఘనుఁడ వగుదె?
మూర్ఖుఁడా! వేషభాషల మురియఁ బోకు. 37

గీ. సరసు లగువారు శాస్త్రార్థచర్చ సలుప
వారిదరిఁ జేరి తగనిమర్వాద మాడ
పరిహసింతురు కావునఁ బలుక వలదు
మూర్ఖుఁడా! వేషభాషల మురియఁ బోకు. 38

గీ. ధర్మమార్గంబులను దెల్ప ధార్మికుఁడవె?
సద్గుణంబులు బోధింప శాంతమతివె?
పరుల వంచించి సతతంబు బ్రతుకునీవు
మూర్ఖుఁడా! వేషభాషల మురియఁ బోకు. 39

గీ. సకలవిద్యల నేర్చినసరసుఁడ వని
ధనము యశమును గలిగినధన్యుఁడ వని
విఱ్ఱవీఁగినమాత్రాన విబుధుఁ డనరు;
మూర్ఖుఁడా! వేషభాషల మురియఁ బోకు. 40

గీ. ఉపనిషద్వాక్యముల నేర్చియుంచు వేని,
జపతపంబులఁ బొద్దులు జరపు దేని,
చిత్తమును బరిశుద్ధిగాఁ జేయఁ గలవె?
మూర్ఖుఁడా! వేషభాషల మురియఁ బోకు. 41

గీ. ఆశ లుడుగక వైరాగ్య మబ్బఁ బోదు;
క్రోధ ముడుగక శాంతంబు కుదురుపడదు;
శాంతమునఁ గాని హృదయంబు చక్కఁబడునె?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 42

గీ. భార్య యెవ్వతె? సంసారభార మెద్ది?
పుత్త్రు లెవ్వరు? కుమతి! యీబూటకములు
మిథ్య లని నమ్మి జ్ఞాని వై మెలఁగు మెపుడు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 43

గీ. క్రోధమోహలోభంబులు కూడి యుండ
నెంతకాలంబు బ్రతికిన నేమిఫలము?
వయసు ముదిరిన వాంఛలు వదల కున్న
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 44

గీ. పెద్దకాలంబు జీవించి సుద్ది తెలిసి
చేయుతప్పులఁ గప్పినచెనఁటిమనసు
ధర్మసత్యశౌచంబులఁ దాల్ప గలదె?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 45

గీ. పాపములఁ జేసి ప్రజలు నిజ భర్తుఁ డనఁగ
మసలఁజాలుదు, వద్దాన మనసు పొందు
దుఃఖ మెబ్భంగి నైనను దోలఁ గలవె?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 46

గీ. ఆత్మ దేహమునం దున్నయట్టివేళ
పుణ్యపాపచయంబులు పొందుచుండుఁ
గాన నవ్వేళ నానందకరుఁడ వగుచు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 47

గీ. బ్రతికియుండుట దుఃఖంబు పడుటపొందెటు
సౌఖ్యదుఃఖము లెవ్వఁడు సమ మటంచుఁ
దలఁచునో వాఁడు నిర్మలత్వము వహించు
మూాఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 48

గీ. మరణమును శాశ్వతం బని మదిని నమ్మి
పరులు తనవారు ననియెడుభావ ముడిపి
సర్వజనసమ్మతంబు గా జరుగ వలయు
మూాఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 49

గీ. మేఘమండలమున నుండుమెఱుపుభాతి
చిత్తమున సద్గుణంబులు చేరి యుండు,
వానిని బ్రకాశముగఁ జేయ వలయు నెపుడు
మూాఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 50

గీ. తప్పుఁ జేసిననిను జూచి ధన్యుఁడ వని
మెచ్చి నీవారు నుతియింప మేటి నగుదె?
మనసునం దున్నమలినంబుఁ జెనకవలయు
మూాఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 51

గీ. ఘనుఁడ వీ వని మెచ్చిన గారవంబు
గలిగె నని సంతసింపకు, మలిన మైన
చిత్తమందలిదోషంబు జెనకకుండ
మూాఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 52

గీ. దోషసంపర్క మైననీదుష్టబుద్ధి
పరుల వంచించి నడచిన బాగు పడదు
సజ్జనులమైత్రి నిరతంబు సలుప నున్న
మూాఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 53

గీ. పరుల వంచించుటయు నీకు ప్రాభవంబు;
తామసము దాల్చుటయు నీకు ధర్మనిరతి;
మాయలను బన్నుటయు నీకు మంచితనము;
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 54

గీ. ధర్మసంపత్తితో మది తనర వలయు;
నిశ్చలం బైనజ్ఞానంబు నేర్వ వలయు;
దుష్టమార్గంబులను వేగఁ దొలఁగ వలయు;
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 55

గీ. కామరాగాదిశత్రుసంఘంబు చేరి
జ్ఞానధనమును హరియించుఁ గాన, వేగ
ధర్మసత్యాదిమిత్రులదరికిఁ బొమ్ము
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 56

గీ. విద్య గలిగిన వినయంబు వెలయ వలయు;
వినయమునకును శాంతంబు గొనుట మేలు;
శాంత మబ్బిన సకలంబు సఫల మగును;
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 57

గీ. మలినచిత్తుని బ్రేమించు మత్సరంబు;
మత్సరంబును గ్రోధంబు మఱిఁగి యుండు;
క్రోధ ముండిననరునకు గుణము సున్న;
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 58

గీ. క్రమముగా నంతరింద్రియగణము నెల్ల
నణఁగఁ జేయుట మేలు మే లనిరి బుధులు
వారిబోధలు మునిజనవర్తనములు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 59

గీ. ఎల్లదుర్గుణములఁ గ్రోధ మెక్కుడంచు
క్రోధమున సద్గుణంబులు కుంగు నంచు
ధర్మమార్గముమిత్తి క్రోధంబు సువ్వొ
మూాఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 60

గీ. గాలివానల కెసుమంత కదలకుండ
పాదపంబులు నిలిచినపగిది, బుధులు
కలిమిలేములు కలిగినఁ గలఁగకుందు
మూాఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 61

గీ. జీవ మెల్లదేహంబులఁ జెంది యుండు
జీవమును బాయ దేహంబు చెడును గాన
దేహ మది నాశనం బని తెలిసి సతము
మూాఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 62

గీ. ఆలుబిడ్డలు నీవెంట నంటి రారు
భాగ్యభోగ్యాదిబులను నమ్మి బ్రతుక వలదు
చిత్తవృత్తులఁ జెండినఁ జెందు సుఖము
మూాఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 63

గీ. పరధనంబున కాసింపఁ బాడి గాదు
పరసతులఁ గూడ నెంచుట పాడి గాదు
పరుల కపకార మొనరింపఁ బాడి గాదు
మూాఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 64

గీ. పరసతులఁ దల్లినలె నెంచు భావమందు
పరులయున్నతి గోరుము భావమందు
పరుల వంచింప నెంచకు భావమందు
మూాఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 65

గీ. సకలపాపంబులకు నీవు సలుపుచుండి
యుపనిషద్వాక్యములఁ బల్కుచుందు వేని
పరమభక్తుండ వని నిన్ను బలుకఁ బోరు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 66

గీ. న్యాయమార్గంబుగా నీవు నడతు వేని
పరుల దూషించు టెన్నఁడు పాడి గాదు
సకలజనులను నిందించి సంతసమున
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 67

గీ. పావనం బగుధర్మంబు పదటఁ గలిపి
సత్యశౌచాదిగుణముల సంహరించి
ఘనుఁడ వని విఱ్ఱవీఁగినఁ గార్య మగునె?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 68

గీ. తావితోఁ గూడుకొనియున్న పూవుభంగి
వరసుగుణరాజి నరునకు వన్నె దెచ్చుఁ
గాన సద్గుణములఁ దాల్పఁ గడఁగ వలయు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 69

గీ. తోషణంబులు విబుధసంభాషణములు
పోషణంబులు ఋజుమార్గభూషణములు
భీషణంబులు దుర్మార్గభాషణములు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 70

గీ. పాడిపంటలు గలిగి సంపదలు గలిగి
కాలకము లుండఁ గత మేమొ గాంచవలయుఁ
గాని బిరుదులఁ దాల్చిన ఘనుఁడ వగుదె?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 71

గీ. బీదవారలు దుఃఖింపఁ బ్రీతితోన
పడ్రిసోపేతముగఁ దిని సంతసించి
దేశభక్తుండ నని చాటి తిరుగఁబోకు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 72

గీ. తర్క వేదాంతమీమాంసధర్మశాస్త్ర
ములఁ బఠించిన మోహవిముక్తి రాదు
మనసునం దాశలను రోసి మసలకున్న
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 73

గీ. తోడిజనులు దుఃఖింప సంతుష్టిఁ జెంది
మసలునెడ స్వేచ్ఛలే దనుమాట వినవె?
మోసమున జీవనము సేయ దోస మనరె?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 74

గీ. విద్య నేర్చినమాత్రాన విబుధుఁ డగునె?
ధర్మముల నేర్చినంతన ధన్యుఁ డగునె?
వినయమును శాంతమును లేనివేళ నరుఁడు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 75

గీ. సానఁ బట్టినరత్నమువలెని దోష
తిమిరమును బాయ చిత్తంబు తేజరిల్లు
నదియు సజ్జనుమైత్రిన యబ్బుఁ గాదె?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 76

గీ. పద నెఱిఁగి విత్తనముఁ జల్లుపగిది మనసు
నిర్మలం బగువేళల నీతి నాఁగఁ
బఱగు బీజములను జల్ల ఫలము దక్కు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 77

గీ. మనసు మర్కట మని చెప్పుమాట వినవె?
మానసము జిక్కఁబట్టుట మంచి దనరె?
జ్ఞానరజ్జువుతో దానిఁ గట్టిపెట్టి
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 78

గీ. దూషణము సేయునెడ మది దుఃఖపడక
భూషణము సేయువేళల పొంగిపడక
సమముగా నెంచు రెంటిని సజ్జనుండు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 79

గీ. నిర్మలం బగుమానసనీరరాశి
ధర్మసత్యంబు లనెడురత్నములు గలవు
జ్ఞానజాలకమున వానిఁ గనుట లెస్స
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 80

గీ. పేదలకు బిచ్చ మనిశంబుఁ బెట్టునతఁడు
సాదరంబున ధర్మంబు సలుపునతఁడు
చేయుచున్నాఁడు మానవసేవ నెపుడు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 81

గీ. వేదములు నాల్గు జదివినవిబుధవరుఁడు
తర్కవేదాంతములు నేర్చుధన్యతముఁడు
శమము దమమును లేకున్న జడుఁడు గాఁడె?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 82

గీ. మోహ ముండిన లోభంబు ముసురు, దానఁ
గామ ముదయించు, నద్దానఁ గలుగు క్రోధ,
మట్టిక్రోధంబు వైరముఁ బుట్టినిల్లు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 83

గీ. అగురు మండుచు నుండిన నతిసుగంధ
మొసఁగు నట్టులె సజ్జనుం డసదుమాట
లనువిపాగ్నుల దీపించు, నలఁతి వడఁడు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 84

గీ. చందురుం డున్నతియుఁ బాటు నందు నట్లు
ఘనుల కెప్పుడు సౌఖ్యదుఃఖములు కలుగు
తారకలభాతి విబుధాళి తనరఁ గాదె?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 85

గీ. చిలువగమి చందనంబును జేరునట్లు
సకలసద్గుణసౌరభాస్వాదనమున
సత్పురుషుఁ గోరి దుష్టులు సనుట నిజము
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 86

గీ. కాకి శిఖరంబుపైఁ కెక్కి గరుడి యగునె?
పంది దేవాలయముఁ జేర నంది యగునె?
తగనిపదవులఁ గోరుట తగవు కాదు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 87

గీ. పరులసౌఖ్యంబు గోరుచు బ్రతుకువారు
తమసుఖంబులఁ గోరరు ధన్యు లగుట;
కుసుమముల నిచ్చువృక్షంబు గోనునె తావి?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 88

గీ. విమలచిత్తుని, మలినుని సమతతోడ
నాదరించును పండితుండైన బుధుఁడు
వన్నె తఱుఁగని యలగంధవహుని భాతి
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 89

గీ. పాటుపడి జీవనముఁ జేయ వలయు నండ్రు
పాటుసేయువాఁడె భాగ్యంబు బడయు నండ్రు
పాటుపడువాని దేశంబు ప్రబలు నండ్రు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 90

గీ. ముత్తుకలఁ గోయువారలు కుత్సితులును
ధర్మశాస్త్రసంపన్నులు తపసు లైరి
కాల మొకరీతి నుండదు గాదె జగతి?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 91

గీ. జీవనము సౌఖ్యతరముగఁ జేయువారు
చిత్తమాలిన్యమును ముందు చెనకవలయుఁ
జిత్తమును సంస్కరించినఁ జెందు సుఖము
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 92

గీ. పరుషవాక్యంబు లెన్నఁడు పలుకకుంట
ధర్మమార్గము నెన్నఁడు తప్పకుంట
మంచి దని చెప్పి రార్యులు మదిని నమ్మి
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 93

గీ. పొరుగువారలు దీనులై పొరలుచుండ
నార్తిబాధల వారింపవలయు సుమ్ము
కలిమి శాశ్వత మని నమ్మి గర్వపడకు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 94

గీ. కఱవులును రోగములు నాఁటి కలఁతఁ జేయ
వాని దొలఁగింప శ్రమపడవలయుఁ గాని
భాగ్యవంతుఁడ నని గర్వపడుట తగదు
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 95

# శారికా గీతము.

---

శారికాంగన కాసారతీరమందుఁ
జేరి జలకేళి సవరించి చెలులఁ గూడి
మందమారుత మందందు మసలు చుండ,
విరులక్రొత్తావిబుగబుగల్ విస్తరిల్లఁ,
బండుటాకులరాగంబు పరిఢవిల్ల,
ద్విజతతులశ్రావ్యనాదముల్ విందు సేయ,
కుటజములనీడ పుష్పాళ్లు కుప్పతిల్ల,
చలువపందిళ్ల నొప్పుమంజరులతోడ,
విరియఁ బూచిన సంపఁగెవిరులతోడ,
రమ్యతర మైనశుకవిహారములతోడ,
శ్రుతుల కింపైనపరపుష్టరుతులతోడ,
వన్నె మీరినయుద్యానవనముఁ జేరి
మాధవిని గూడి శోభాయమాన మగుచు
పల్లవిత మైనసహకారిపజ్జ జేరి
పాట పాడెడువేళ నుపాంగమట్లు
బంభరంబులనాదముల్ పటువణింప
మెడలు సారించి శ్రుతులతో మేళవించి
కొంత యొయ్యారమును జాలువింతనడలు,
నడకలకు వన్నె పెట్టెడునాట్యములును,
నాట్యమున కింపు రవణించునట్టిపలుకు
నెచ్చెలులతోడఁ బల్కు నాసచ్చరిత్రి
సరసముగఁ బాడుచుండ వసంతమందు
శారికాగీతములు విన శ్రావ్య మగుట
నెలవారలు చెవియొగ్గు టేమివింత?

గీ. తప్పుమార్గములను బన్ని తగవులాడి
పాపములఁ గప్పిపుచ్చెడుపామరుండు
విమలవిజ్ఞానవేత్త నా వెలయఁ గలఁడె?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 96

గీ. పండితుం డైనమాత్రాన పట్టువడదు
దానములఁ జేసినంతన తగులుకొనదు
నిర్మలజ్ఞానసంపత్తి నీచమతికి
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 97

గీ. పరులు దూషించినంతన భ్రష్టుఁ డగునె
ధర్మసత్యశౌచంబులఁ దాల్చునతఁడు?
పరుల వంచించి నతిచిన పరువు గలదె?
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 98

గీ. దేహమును చంచలం బని తెలిసి సతము
జీవమును నమ్మి వర్తించి చెడరు బుధులు
పౌరుషంబునఁ గీర్తిని బడయఁ గోరి
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 99

గీ. ధర్మసత్యశౌచంబులు తనరుపొంకు
నిర్మలజ్ఞానసంపత్తి నెగడుపొంకు
సత్యవో లప్పరా విది సంతరించె;
మూఢుఁడా! వేషభాషల మురియఁ బోకు. 100

పన్నాబాయి — చారిత్రకప్రధాన మైననవల. రాజకుమారునిఁ గాపాడుటకు తనకుమారుని శత్రునికత్తి కెర చేసిన యొక రాజపుత్రిసాధ్వీమణిచరిత్ర. ఇందలి రాజనీతి, గూఢచారులచతురోపాయములును జదివి తీరవలెను. సత్యవోలు అప్పారావుగారిచే రచింపఁబడినది. 0.8.0

హేలావతి — చరిత్రాత్మక మైననవల. ఒకమాలస్త్రీ హుమాయూను చక్రవర్తియొక్క మంత్రికుమారుని వరించి పెండ్లియాడినకథ. తల్లాప్రగడ సూర్యనారాయణరావు గారిచే రచింపఁబడినది. 0 4 0

ప్రభావతి — ప్రభావతీప్రద్యుమ్నమునకు సరియైనవచనము. పింగళి సూరనార్యుఁడె దీనిని వచనమున వ్రాసినట్లుండును. 0.4 0

మీరాబాయి — భక్తిరసప్రధాన మైన పద్యకావ్యము. తనపతిచే నింద మోపబడి ప్రాణముల ద్యజించిన శ్రీకృష్ణభక్తురాలిచరిత్రము. ఇందలి పద్దెములు ముక్కుతిమ్మనార్యునిపద్దెములవలె ముద్దులొలుకుచుండును. 0-4-0

కురుపాండవదాయభాగవిమర్శనము — ఇది శ్రీకాశీభట్ల బ్రహ్మయ్యగారి కురుపాండవదాయభాగవినిర్ణయముపై వ్రాయఁబడిన విమర్శనము. కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిచే రచింపఁబడినది. 0.1.6

బ్రాహ్మమతము — ఇందు దేవుఁడు, మానవుఁడు, ప్రకృతి, ఉపాసన, పాపము — మోక్షము, అవతారములు — మధ్యవర్తులు, ప్రమాణగ్రంథములున్నగు విషయములు యుక్తియుక్తముగ జర్చింపబడినవి. పాలపర్తి నరసింహముగారిచే రచింపఁబడినది. 0-8-0

ఆర్యసూక్తిముక్తావళి (ప్రథమభాగము) — ఇందు భారతమునందలి నీతులు, రాజధర్మములు తెలుగుపద్యములు ఏర్చి కూర్పఁబడినవి. 0-4-0

కర్ణభారము — ఇది కాళిదాసునకుఁ బ్రాచీనుఁడగు భాసమహాకవిచే రచింపఁబడిననాటకమునకుఁ దెనుఁగు. మానపల్లి రామకృష్ణకవి ఎమ్. ఏ గారిచే ననువదింపబడినది. 0-2-0

నీతిబోధ — ఇది యొకశతకము. ఇందలిపద్యము లెట్టిమూఢుల కైన నిర్మలజ్ఞానమును ప్రబోధించి నీతివంతులుగ నొనరించును. 0-1-6

చాణక్యశతకము — సంస్కృతమున చాణక్యుఁడు మున్నగు నీతిశాస్త్రసంపన్నులు రచించినశ్లోకములకు సరియైన తెనుఁగు. 150 పద్యముల గలిగి చక్కనినీతులతో మనోహరమగు శైలితో నలరుచుండును. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిచే రచియింపఁబడినది. 0-2 0

[illegible] భవిష్య[illegible] — [illegible]
పోవు మానవులమనోవికారము లెట్లుండునో యిందు [illegible]
వర్ణింపబడినవి. అపూర్వవర్ణనలతో నలరారుచుండును.
ఆక్కిరాజు ఉమాకాంతము గారిచే రచియింపబడినది. [illegible]

27. ఆర్యసూక్తిముక్తావళి—(ద్వితీయభాగము) భాస్కరరామాయణము, నిర్వచనోత్తర రామాయణము, వాసిష్ఠరామాయణములయందలి గ్రంథములలోని నీతులు ధర్మములు తెలుపుపద్యములు ఇందు చేర్చి కూర్చబడినవి 0.2.0

28. బ్రాహ్మమతోద్దేశము—ఇందు మతము, మతసంస్కరణము, బ్రాహ్మమతము మున్నగువిషయములు యుక్తియుక్తముగ జర్చింపబడినవి. వెలిదండ శ్రీనివాసరావు గారిచే రచియింపబడినది. 0.2.0

29. భక్తసంజీవని—భక్తులపాలిటికల్పవృక్షము భాగవతము నందలి వెల్లివిరిసియున్న భక్తిరసపూరితము లగుపద్యము లన్నియు సర్వమతసమ్మతం బగునటుల సంస్కరింపబడి భగవంతుడు, భాగవతులు, భగవన్నామసంకీర్తనము, భగవత్సేవ, భగవద్భక్తి, ఉద్బోధన, వందనము, స్తోత్రము, ప్రార్థన అను వేర్వేరుశీర్షికలక్రింద నిబద్ధముగ గూర్చబడినవి. ఇందు సుమారు 350 పద్యరత్నములు గలవు. భక్తుల కియ్యది నిజముగ సంజీవనియే యని చెప్ప నొప్పును. వాశము కృష్ణారావు గారిచే రచియింపబడినది. 0.8.0

30. రోహిణీచంద్రగుప్తము—అలెగ్జాండరుమనుమరాలిని చంద్రగుప్తుడు పెండ్లియాడినకథ. హిందూదేశము పాశ్చాత్యులగు గ్రీకులబారి పడకుండ నిలిపిన మంగళసేనుని నిర్వ్యాజపరాక్రమము ఇందెంతె కొనియాడినను తీరదు. 0.2.0

ధర్మప్ర[illegible]—అధర్మము ధర్మముచేతనే గాని అధర్మముచేత చక్కబడ నేర దనుధర్మమును సంస్థాపించు చక్కనిచిన్ననీతికథ. 0.2.0

దుర్గావతి—చరిత్రాత్మక మైననవల. మనోహరకథాకల్పనమును గలిగి చక్కని యితివృత్తముతో నలరారుచుండును.
గోటేటి జగన్నాథరావు గారిచే రచియింపబడినది. 0.8.0

బ్రాహ్మసమాజచరిత్ర (ప్రథమభాగము)—పండిత శివనాథశాస్త్రి ఎమ్. ఏ. గారిచే నింగ్లీషున వ్రాయబడినగ్రంథమునుండి యనువదింపబడినది. చక్కనిలలిత మగుసులభశైలితో నలరుచుండును. [illegible]